సంపుటము 3] ఫిబ్రవరి 1917 [సంచిక 8

# బాలమిత్ర




విగ్రహారాధన

ఒక యూరిలో సుందరియను బాలిక యొకర్తుక యుండెను. చిన్ననాటనే తలిదండ్రులు గతించుటచే నీమెను

పెదతండ్రి పెంచుచుండెను. మరియు నీమె పసిపిల్లగా నున్నపుడే నీమెకు గట్టబడ్డ భర్తగూడ గతించెను. బాలవితంతు వగు నామెను ఆమె పెదతండ్రియు, నామె బంధువులును మిగుల హింసింపసాగిరి. ఆ హింసలబడలేక యొకనాడామె కాళికాదేవి గుడికిబోయి తన్ను ఆ బాధలనుండి తప్పించుమని గట్టిగ మొరబెట్టెను; ప్రార్థించెను. కేకలువేసి మరి విన్నవించెనుగాని యా రాతివిగ్రహము పలుకదయ్యె. దాని కండ్లు ఎఱ్ఱగనుండి ఒకే దీక్షతో చూచుచుండెనుగాని బిడ్డ మొరనాలకించినట్లు గనబడదయ్యె. కొన్నిగంటలిట్లు ప్రార్థించిన వెనుక ఆ బిడ్డకు విసువుదోచి యా విగ్రహమునుకొట్టి నెట్టసాగెను. అదియు సగము బ్రద్దలైయున్నందున క్రింద పడెను. ఆ శబ్దమువిని పూజారి పరుగునవచ్చి 'కాళిశాపము నీపై తప్పకవచ్చును పొమ్ము' అని యా బిడ్డను బైటికంపెను. పిమ్మట నామె అంతకుపూర్వ మొక పంతులమ్మ తనయూరికి వచ్చి క్రీస్తునుగూర్చి చెప్పుట జ్ఞప్తికిదెచ్చుకొని, ఆ క్రీస్తే ప్రేమగలవాడని తన హృదయముననున్న అంతరాత్మ చెప్పుటచే, నా సమీపముననున్న నొక పంతులమ్మయొద్దకు వెళ్లి తనకు క్రీస్తునుగూర్చి పూర్తిగా జెప్పుమని కోరి చిట్టచివరకాయనను తెలిసికొనెను. "రాతివిగ్రహమునకు మ్రొక్కడము వల్ల యేమినెమ్మది కలుగలేదు గాని, ప్రేమగల యేసుక్రీస్తును నమ్మడమువల్ల మనస్సుకు నెమ్మది కలిగినది."

# రుష్యాదేశము



మంచులో నడచుట

ప్రియ పిల్లలారా!

మీరు నీటిగడ్డ నెప్పుడైనను చూచియుంటిరా? మీలో నెవరైనను, ఎక్కడో ఒకచోట చూచియుండ

వచ్చును. హిమమును, నీటిగడ్డయు బహు విశేషముగా నుండు ఒక దేశమునుగూర్చి మీకు చెప్పబోవుచున్నాను. అదే రుష్యాదేశము. ఇది చాల పెద్దదేశము. మీలో నెవరైనా హిమమును చూచితిరా? ఎవరును చూడలేదని తలంచుచున్నాను. అది బహు తెల్లగానుండు దూదివలెను మెత్తగా నుండును. అది ఆకాశమునుండి పడును. గాలి ఎక్కడ విశేషము చల్లగానుండునో అక్కడ ఏర్పడును. సంవత్సరములో ఆరుమాసములవరకు రుష్యాలో హిమము పడును. బడికిబోవు పిల్లలు తమ మార్గములో ముందున్న దేమియో గుర్తించలేనంత దట్టముగా కొన్నిసారు లది పడును, గనుక వారు అప్పుడప్పుడు దోవతప్పిపోదురు. అట్లు తప్పిపోయిన పిల్లలు పటములో కనుపడుచున్నారు చూడుడు. దారితప్పి హిమములలో కూరుకొని పోయిన పిల్లలను వెదకితెచ్చుటకు పెద్ద గండుకుక్కలను పంపుదురు, ఇవి చాల తెలివిగలవి. అవివెళ్లి, పసిపట్టి వెదకి, పడియున్న పిల్లలుగల స్థలమును కనుగొనును. హిమమును తమకాళ్లతో త్రవ్వి ఆ పిల్లలను ఇండ్లకు నోటగరచుకొని వచ్చును. ఇట్లు అనేకమంది ప్రయాణికులు ఈ కుక్కల వలన రక్షింపబడిరి. పటములో అట్టి కుక్కలను రెంటిని చూడవచ్చును.

హిమము నేలపై బడియున్నప్పు డెట్టి బండ్లు రుష్యాలో



నుపయోగింతురో తెలియునా? బండ్ల చక్రములు తీసివేసి, వాటికి బదులుగా వంపు ఉన్న కఱ్ఱలను తగిలించి, వాటిని తోలుదురు. ఈలాగు జనులు బహు త్వరగాను సుఖముగాను ప్రయాణముచేతురు.

రుష్యావారు బహు ధైర్యశాలురు. ఈ యుద్ధమున జర్మను వారిని జయించుటకు పోరాడుచున్నారు. పురుషులు యుద్ధమున నుండగా స్త్రీలును పిల్లలును వారి భోజనముకొరకు

పనిచేయుచున్నారు. రుష్యాలోని కల్లు అంగళ్లన్నియు మూయబడినవి. గాన వారు మునుపటికంటె సౌఖ్యముగా జీవించగలరు.

---

## రుష్యాలోని శీతాకాలము



రుష్యా ఎలుగుగొడ్డు

రుష్యాలో శీతాకాలము బహు తీవ్రముగానుండును. ప్రష్యానుండి ఆ దేశమును దండెత్తిపోయినవారు

బహు భయములో జిక్కుబడియున్నారు. మాస్కోయం దుండువారికి శీతాకాలము శత్రుభయముదీర్చు స్నేహితుడై యున్నాడు. 1812 వ సంవత్సరమునందు నెపోలియను మాస్కో నుండి ఎంత భయంకరమైన స్థితితో తిరిగివచ్చెనో అందరికి తెలిసిన విషయమే. 1708 వ సంవత్సరమున స్వీడన్ రాజగు పన్నెండవ చార్లెస్ రుష్యాపై దాడివెడలి పొందినబాధ లంతగా తెలియకున్నను, అవి నెపోలియను సైనికులు పొందిన వానికంటె తక్కువైనవి మాత్రముకావు. చార్లెస్‌రాజు దండెత్తినప్పుడు పడినంత హిమము 100 సంవత్సరములవర కెన్నడు వచ్చినదికాదు. అది అక్టోబరులో నారంభమై నవంబరు, 1వ తారీఖు వచ్చునప్పటికి బహు అధికమాయెను. కట్టెలు మండకపోయెను. గడ్డిని తగలబెట్టి చలిగాచుకొనిరి. ద్రాక్ష రసము, సారాయి గడ్డకట్టుకొనిపోయెను. రెక్కలుగల పక్షులు క్రిందపడి చచ్చెను. ఊపిరి పెదవులమీదను, గడ్డముల మీదనుండి గడ్డకట్టెను. స్వీడుల కష్టములను వర్ణించ నెవరికిని తరముగాలేదు, “కొందరి చేతులుబోయెను, కొందరికి కాళ్లూ గిరిపోయెను, మరికొందరికి చెవులు ముక్కులు పోయెను. అనేకులు పశువులవలె ప్రాకులాడుచుండి”రని చూచినవా రొకరు చెప్పుచున్నారు.

---

# గోపాలుడు, తోడేలు



గోపాలుని యిల్లొక యడవియందుండెను. తండ్రిగారొక ఉత్తరమునిచ్చి దగ్గరయూరిలో నొకరికి యిచ్చి రమ్మనెను. వాడు బైలుదేరి, యాపని ముగించినవెనుక మిత్రులనందరి దర్శించునప్పటికి ప్రొద్దుగ్రుంకెను. చందురుడొకస

మున ప్రకాశించుచుండెను. గోపాలుడు బైలుదేరి యడవి జొచ్చునప్పటి కతని కొకతోడే లెదురయ్యె. పరుగెత్తుటచే ప్రయోజన మేమియులేదని ఎరిగియుండుటచే నేలం గూల బడి చచ్చినవానివలె బోర్లగా పరుండెను. ఈ విధమున నటించుటచే ననేకులు ఎలుగుబంట్ల బారినుండి తప్పించుకొనిరని ఈ బాలుడు వినియుండుటచే నట్లుచేసెను.

తోడే లితనిజూచి సమీపించి శరీరమంతయు వాసన చూచి, మెడ కిరుప్రక్కల తన ముందరి రెండుకాళ్లనుంచి గొంతుకపై నోటినుంచెను. తన వాడిపండ్లతో కరువబోవుచుండ నీబాలుడు హఠాత్తుగ తన రెండుచేతులతో దాని రెండుకాళ్లను గట్టిగ బట్టుకొని దాని భుజముపై కీడ్చుకొని, గట్టిగ బిగియించి పట్టుకొని యింటిదారిబట్టెను. అతని కరువ యత్నించినను దానిశరీర మితడు వీపుపై గట్టిగ బట్టియుండుటచే నా క్రూరమృగమున కది యసాధ్యమాయెను గాని దాని వెనుకకాళ్ల రెంటితో గోపాలునియొక్క కాళ్లను గీరి గాయపరచెను. వింతయైన బరువుతోను, కాళ్లబాధతోను యిల్లుచేరి గట్టిగ తండ్రినిపిలువ నతడు పలుకడయ్యె. పిలచి పిలచి చివరకు విసుకునొంది, మూసియుండిన తలుపుపై గొట్టెను. అయినను పట్టువిడువలేదు. అంతలో తండ్రి తుపాకి తీసికొని వచ్చెనుగాని, తోడేలు కొమారుని భుజ

ముపై నుండుటజూచి తన వేటకుక్కల విడచెను. వెంటనే నాబాలుడు పట్టువిడచి దాని పారవైచెను. కుక్కలు దాని తరిమి పట్టుకొనినవిగాని అవి దానిచంపక పూర్వమే నీధైర్యశాలుడగు బాలు డొకత్రాటిని దానిమెడకుకట్టి, యొక పెట్టెలోపెట్టి మ్యూజియము కంపెను.

---

# ప్రకృతి పాఠములు

## 30-వ పాఠము

## చూపు

(సశేషము)

కనుపాప కేరంగుండునో దానినిబట్టి ఆయావారిని అట్టికండ్లు గలవారని పిలుతురని నేర్చుకొంటిమిగదా! ఈ పాపలు ఆయా జంతువులలో వేరువేరు ఆకారములు గలిగియుండును. పిల్లికనుపాప ⬯ ఇట్లుండును. గాని గుఱ్ఱపుకనుపాప ఆకారము ⬭ వలె నుండును. చీకటిలోను, వెలుతురులోను పిల్లి కనుపాప ఆకారమునందును పరిమాణమునందును భేదించును. మధ్యాహ్నమప్పుడు వెలుతురు మిక్కుటముగా నున్న సమయమున పిల్లి కనుపాప సన్నని చీరికగా ⬯ నుండును గాని చీకటిలో నది ◯ గుండ్రముగా నవును.

కంటినిగూర్చి నే నింతగా చెప్పితినిగాని, ఏలాగు చూచు చున్నారో చెప్పలేదు. కనుపాపగుండా లోనికిపోవు వెలుతురు వలన కన్నుల ముందున్న వస్తువుల రూపమేర్పడును. ఈ రూపము (ప్రతిమ) కంటిలోపల చీకటిగానున్న ప్రదేశపు వెనుక భాగమున పడును. అద్దముమీదగాని, కదలకుండనున్న నీటిలోగాని ఏవిధముగా రూపమేర్పడునో అదేలాగున కంటి లోపలను ఏర్పడును. గాని, కంటిలోపల చాల చిన్నరూపము పడును. నీటిలో కనుపడు రూపము వస్తువంత యుండును. గాని, నీ కంటిలోపడిన ఆ చెట్టుయొక్క రూపము చాల, చిన్నది. నీవు నీ యెదుటచూచు చెట్లు, చేమలు, మనుష్యులు జంతువులు మొదలగునవన్నియు కలిసి బేడకాసుకంటె చిన్న ప్రదేశమున రూపమేర్పరచును.

అయితే తలలోనున్న మెదడున కీసంగతెట్లు తెలియును. కంటి వెనుకభాగమందున్న ప్రదేశమునకు మెదడునుండి ఒక నాడివచ్చి ప్రతిమ ఏర్పడిన భాగమునంతయు నావరించును. ఈ నాడి మెదడున కేరూపమునుగూర్చి కబురుచేయనియెడల కంటిలో ప్రతిమ ఏర్పడి లాభములేదు. కన్ను బాగుండినను దేనిని చూడలేక పోవచ్చును. కన్ను బాగుండక ఈ నాడి మంచిదైనను లాభములేదు. రెండు బాగుగా ఎప్పుడుండునో అప్పుడు చూపు బాగుగా నుండును.

రెండు కన్నులున్నవి గదా. అట్లైతే ప్రతిది రెండు వస్తువులుగా నెందు కగపడదు. ఎందుకనగా, ఏర్పడు రెండు ప్రతిమలు ఒకటే మాదిరిగా నున్నందునను, రెండు నాడులు ఒకటే సంగతి మెదడుకు తెలిపినందున ఒకటే రూపముగా కనుపడును.

ఆయా పురుగులకండ్లు చాల చిత్రమైనవి. ఈగకు వెయ్యి కన్నులున్నవి. ఇవి బహు చిన్నవిగాన వాటిని మనము చూడ జాలము. ఎన్ని కన్నులున్నను వాటిద్వారా అది మనము మన కన్నులతో చూచునట్లే చూచును. గాని, గాని కన్నులు తలనిండ ఉన్నవి గాన మనవలె తలత్రిప్ప నక్కరయేలేదు.

---

# బైబిలు పిల్లలు

## అహరోను

బాలమిత్రులారా! మనము మోషే, మిరియముల గురించి యిదివరకే చదివియుంటిమి. ఇప్పుడు వీరి సోదరుడగు అహరోనును గురించి నేర్చుకొందము. ఇతని బ్రతుకు విచారించి చూచిన ప్రభుసేవకే యుపయోగించినట్లు చూతుము. ఐగుప్తులో పరోచే ఇబ్రీయుల మగశిశువుల చంప నాన

తివ్వాక పూర్వమే పుట్టినవాడు. మిరియామునకంటె చిన్నవాడు. యోకెబెతు అమ్రాయను భక్తిగల తలిదండ్రులతో యెహోవా భయమందు పెంచబడినవాడు. పోకిరి సహవాసము యెరుగనివాడు. తల్లి మోషేను ఫరోకుమార్తె పుణ్యమువలన ప్రాణాపాయమునుండి తప్పించుకొని బిడ్డను పెంచుచుండగా వీరికడనుండి తల్లికి మిగుల ముచ్చట చూపించినవాడు. ఇతని బాల్యము వివరముగా తెలియకున్నను యౌవన ప్రాయమున చేసిన శూరకృత్యములు అనగా తమ్మునితో కలిసి ఫరో యెదుట నిలిచి ఇశ్రాయేలీయులను ఐగుప్తు చెరనుండి విడిపించుట, విడిపించిన వీరిని అరణ్యప్రదేశమున కానానుకు నడిపించుట మొదలగు పనుల వేదగ్రంథమున చూడవచ్చును. ప్రతి మనుజునికి బలహీనత లుండును గదా! ఇతని బ్రతుకునందు ఒక లోపము చూచుచున్నాము. తమ్ముడు సీనాయి పర్వతమునకు పదియాజ్ఞల తీసికొని రాబోయినప్పుడు తమునిరాక మిగుల యాలస్యమైనందున అరణ్యములో ప్రజలుకోరినట్లు బంగారు దూడనుచేసి వారిని తప్పుమార్గమున నడిపించుట గొప్ప లోపముగదా! అయితే తమ్మునిచే ఆ తప్పునుండి దిద్దబడిన యనంతరము మిగుల పట్టుదలతో ప్రభుని సేవించెను. చూచితిరా! మన బలహీనతలు, అపజయములు మనలను బలవంతులుగను, జయశీలురుగను చేయునని యిచ్చట నేర్చుకొన

వచ్చును. ఇతడు యాజకత్వము చేయునట్లు ప్రభువుచే కోరబడినవాడు. మనము పాపముచేసినను, దానివిషయము పశ్చాత్తాప పడినయెడల ప్రభువు మనల తిరిగి ప్రేమతో చేర్చుకొని మనకు తనపనిలో పాలిచ్చును.

ఇతని జీవితానంతరము ఇతని సంతతివారే ఇశ్రాయేలీయులకు యాజకులుగానుండిరి. మనము మంచివారముగనున్న మన ప్రభువు తరతరములవరకు ఆశీర్వదించును.

ఇశ్రాయేలీయులు అమాలేకీయులతో యుద్ధముచేసినప్పుడు మోషే చేయి ఎత్తిననేగాని లేకపోయిన ఇశ్రాయేలీయులు ఓడిపోవుచుండగా అహరోను తమ్ముని చెయ్యి క్రిందకు పడకుండునట్లు ఎత్తిపట్టుటలో సహాయముచేసెను. ఇట్లు ఇతడు ఇతరుల క్షేమార్థము జీవించెను. ఇతని మరణమును తెలుసుకొనగోరెడివారు సంఖ్యాకాండము 20 అధ్యాయము 22-29 వచనములు చదువుడి.

---

## బాలమిత్రకథ

ప్రియ బాలమిత్రులారా!

పూర్వకాలమందు ఫ్రాన్సుదేశమునందొక బీద పిల్లవాడు కలడు. అతడు కుంటివాడు, నడుచుటకు శక్తిలేదు.

తల్లిమాత్రము కష్టించి దినమునకు అర్ధశేరు పాలుమాత్రము తెచ్చి యిచ్చుచుండెను. ఈ పిల్లవాడు తన స్వంత గ్రామము



లోని బాలురు బడికిపోక సోమరులై తిరుగుచుండగా వారిని యేలాగు బాగుపర్చగలనా యని చింతించుచుండగా ఒకదినము తాను తన తల్లితో, అమ్మా! నాకొరకు అర్ధశేరు పాలు యిచ్చుచున్నావుగదా! రేపటినుండి నాకు పావుశేరు పాలుమాత్రము తెచ్చియిమ్ము. మిగతపాలు అమ్మి నాకొరకు ఒక పెనసలు, కాగితము లిమ్మని యడుగగా, తల్లి కుమారుని యిష్టప్రకారము తెచ్చియిచ్చుచుండెను. ఈ పిల్లవాడు క్రీస్తు చరిత్ర స్పష్టముగా

వ్రాసి బజారులలో వేయించుచుండెను. అనేకమంది బాలురు బజారులలో తిరుగుచు వానిని చదివి, గుణపడి, మంచి విద్య సంపాదించిరి. క్రీస్తుకు గొప్ప సువార్త సాక్షులైరి. బాలమిత్రులారా! ఒక కుంటివాడు క్రీస్తునుగూర్చి యింత గొప్ప పని చేయగా, మన గ్రామములో వుండే సోమరి పిల్లలకొరకు దేవుడు మన కనుగ్రహించిన కాళ్లద్వారా మరియెంతో మంచి పనిచేయవలసియున్నాము. దేవుడిట్టిపని చేయుటకు యేర్పాటు చేసుకొనియుండగా, సంతోషముతో మనకు తెలిసినంతవరకు మనవంటి చిన్నవారికి తెలియచేసి మన హిందూదేశమునకు క్రీస్తురాజ్యము వచ్చులాగున దైవసహాయముతో చేయుదుము గాక!

ఇట్లు మీ ప్రియబాలమిత్రుడు,

యస్, రత్నవేలు,

సానటోరియం,

మదనపల్లి

C. L. S. PRESS, MADRAS—1917